
యం. ప్ల్యాత్స్కోవ్స్కియ్
మబ్బుమీద
స్వారి

# కొక్కిరాయి బడి

చదువుల నిధి కొక్కిరాయి అడవిలో బడి పెట్టా లనుకుంది. అనుకోవడమంటే జరగడమే. పిల్ల జంతువులన్నీ మొదటి పాఠానికి ఆలకూడినాయి. కొక్కిరాయి పంతులమ్మ వాటిని డెస్కుల వద్ద కూర్చోబెట్టింది. అన్నీ పంతులమ్మవైపు చూస్తూ, మొదటి పాఠం మొదలుకావడానికి కాచుకున్నాయి. కొక్కిరాయి బోర్డుమీద ఒక పదం రాసింది.

అది వాటితో యిలా చెప్పింది: ''పిల్లలూ, మీరు ఒక్కొక్కరే యీ పదం చదవండి. నేను పలికినట్లు పలకండి: అమ్మ.''

జంతువులు పలకలేదు. యేదీ నోరు మెదలించలేదు.

కొక్కిరాయి పంతులమ్మ గొర్రెపిల్ల వద్దకు వెళ్లి,

''యేదీ, యీ పదం నీవు పలుకు చూద్దాం,'' అంది.

గొర్రెపిల్ల యెంత ప్రయత్నించినా, ''బా — బా'' అని తప్ప మరేమీ అనలేకపోయింది. కొక్కిరాయి పంతులమ్మ మేకపిల్లను పలకమని అడిగింది. అది ''మే — మే'' అని మాత్రం అనగలిగింది.

కొక్కిరాయి పంతులమ్మ కోపంతో పుస్తకం మూసేసి, తనవైపు బిక్కుబిక్కుమంటూ చూస్తున్న కుక్క పిల్లతో యిలా అంది:

''నీవు పలుకు చూద్దాం.''

కుక్కపిల్ల నోరు తెరచి, ''భౌ — భౌ'' అంది.

కొక్కిరాయి పంతులమ్మ ముఖం మాడ్చుకొని,

''ఛీ — నీకు యేమీ అనడం చేతకాదు'' అంది.

కోడిపిల్ల వంతు వచ్చింది. అది ''పీప్ — పీప్'' అంది.

పిచ్చికపిల్ల ''చిర్ప్ — చిర్ప్'' అంది.

ఆవుదూడ ''మూ — మూ'' అంది.

బాతుపిల్ల ''గా — గా'' అంది.

పిల్లిపిల్ల ''మ్యావ్'' అంది.

పందిపిల్ల ''వాంక్ — వాంక్'' అంది.

కొక్కిరాయి పంతులమ్మ బుర్ర గోక్కుంది. అది తీవ్రంగా ఆలోచించింది. చివరకది అందరికీ మంచి మార్కులు యిచ్చింది. యెందుకంటే, ''అమ్మ'' అని అన్నీ సరిగా పలికినాయి. కాకపోతే, దేని పద్ధతిలో అది పలికింది.

# అంటివేసుకునే ఆట

ఒకనాడు అడవిలోని జంతువులన్నీ నిర్ణయానికి వచ్చినాయి, తమలో యేది వేగంగా పరుగెత్తుతుందో తేల్చుకోవాలని.

''మనకు యిప్పటికే తెలుసుగా. అందరికంటె వేగంగా పరుగెత్తేది నేనే,'' అని చిరుతపులి అంది.

''అంత తొందరపడాకు. అదింకా రుజువు కాలేదు,'' అని జిరాఫీ చెప్పింది.

''అవును,'' అని పులి అంది. ''యెవరు వేగంగా పరుగెత్తేదీ చూద్దాంగా.''

లేడి చెప్పింది: ''యిలా చేద్దాం. చిరుతపులి పులిని యెదుక్కోడానికి ప్రయత్నిస్తుంది. జిరాఫీ నాకు అందకుండా పరుగెత్తడానికి ప్రయత్నిస్తుంది. తరువాత అందరమూ స్థానాలు మార్చుకుందాం.''

''మంచి ఆలోచన,'' అని చిరుతపులి గురగురలాడింది. ''కానీ, పులి నన్ను యెదుక్కున్నదీ లేనిదీ నాకెలా తెలుస్తుంది?''

''నిన్ను యెదుక్కున్నప్పుడు నిన్ను తాకుతుంది,'' అని లేడి వెంటనే జవాబు చెప్పింది.

''బాగుంది! యింక మొదలుపెడదాం,'' అంది జిరాఫీ.

సరిగ్గా అప్పుడు వర్షం మొదలైంది. నేలంతా తేమా, బురదా అయింది. బురద గానీ, నీటి మడుగులు గానీ పందేన్ని ఆపలేదు. యెందుకంటే, తమలో యెవరు అందరికంటె వేగంగా పరుగెత్తేదీ తెలుసుకోవాలని అన్ని జంతువులకూ కోరిక వుండింది.

బురదలో, మట్టిలో అవి మూడు రోజులు ఒకదాని నొకటి వెంటబడినాయి. వాటి పంజాలకు బురద అయింది గనుక, అవి తమ ముందు పరుగెత్తేవాటిని తాకినప్పుడల్లా ముందున్నవాటి చర్మాలకు మచ్చలు అయ్యేవి. కొన్ని మచ్చలు దట్టంగా, కొన్ని పలుచగా వుండినాయి.

చివరకు వర్షం ఆగింది. ఆకులమీది నీటి బిందువులు ఆరిపోయినాయి, కానీ జంతువులమీది మచ్చలు నిలిచినాయి. అలా వచ్చినాయి వాటికి మచ్చలు.

అలా పుట్టింది అంటివేసుకునే ఆట.



# నేను ఫస్టు

ఒక రోజు కప్పా, బాతూ వాదించుకున్నాయి, వేగంగా యీదేది నేనంటే నేనంటూ.

చివరకవి పెద్ద నీటిమడుగువద్ద చేరి, మడుగు అంచున పక్కపక్కన నిలుచుకున్నాయి.

"మూడుదాకా యెంచుదాం," అంది బాతు.

"సరే. మూడుదాకా యెంచడం నాకూ వచ్చు," అంది కప్ప.

"క్వక్ — క్వక్ — క్వక్!" అంది బాతు.

"క్రొక్ — క్రొక్ — క్రొక్!" అంది కప్ప.

తరువాత రెండూ మడుగులోకి దూకినాయి.

బాతు చేతనైనంత వేగంగా కాళ్లు ఆడిస్తూ పోయింది. మడుగు ముగియవచ్చింది. తానే గెలిచినానని బాతు అనుకుంది. యింతలో దానికి కప్ప కనిపించింది, అవతలి గట్టున గడ్డిలో కూర్చొని, తనకోసం యెదురుచూస్తూ.

కప్ప నవ్వుతూ యిలా చెప్పింది:

"బుర్ర ఉపయోగించాలి. నేను సగం మడుగు గెంతినాను. తక్కింది యీదినాను. అదే తెలివి గల పద్ధతి."

# యుక్తి జవాబు

బాతుపిల్లను తల్లి పాటకచేరీకి పిలుచుకపోయింది. ఆకుతేలు ఫిడేలు వాయించింది. బాతుపిల్ల విని,

''ఓస్! నేను అంతకంటె బాగా వాయించగలను!'' అంది.

''వాయించు, చూద్దాం,'' అంది తల్లి. పిల్లలు డంబాలు కొట్టడం తల్లి కిష్టం లేదు.

''ఓ, మరి నాకున్నది రెండు కాళ్లే. ఒక కాలితో ఫిడేలు పట్టుకొని, మరొక కాలితో కమాను పట్టుకుంటే, నేను వేదికమీద నిలబడే దెలా?'' అని యుక్తిగల బాతుపిల్ల జవాబిచ్చింది.



# రబ్బరు బూటు

ఒకనాడు యెలకకు ఒక అరిగిపోయిన రబ్బరు బూటు కనిపించింది. ''దీనితో నాకేమీ పని లేదు,'' అని అది అనుకొని, అక్కడినుండి వెళ్లబోతుండగా, ఆ దారిన వచ్చే పందికొక్కు కనిపించింది.

''ఆ రబ్బరు బూటు నీదేనా?'' అని పందికొక్కు అడిగింది, దానివైపు చూసి కండ్లారుస్తూ.

''అవును,'' అంది యెలక.

''అది నాకిస్తావా?''

''నాకొక విశాలమైన కన్నం తవ్విపెడితే యిస్తాను,'' అంది జిత్తులమారి యెలక.

పందికొక్కు బాగా తవ్వగలదు. త్వరలో అది యెలకకు మంచి కన్నం తయారుచేసింది.

''యెలకమ్మా, యిదిగో నీ కొత్త యిల్లు. రబ్బరు బూటు నేను తీసుకుంటున్నాను.''

యెలకకు సంతోషమైంది. అది సొరంగంలోకి దూరి, తన కొత్త యిల్లు చూసుకుంది. పందికొక్కు రబ్బరు బూటును లాక్కుపోతూ, అది దేనికి పనికి వస్తుందా అని ఆలోచించింది. అది దానిని గడ్డిలో వదలేసి పోడానికి సిద్ధంగా వుండింది. యింతలో ముళ్లపంది కనిపించింది.

''ఆ రబ్బరు బూటు నీదేనా?'' అని ముళ్లపంది అడిగింది.

''నిస్సందేహంగా.''

''అది నా కివ్వవూ?''

''నా కొక డజన్ ఆపిల్ పండ్లు తెచ్చిపెడితే యిస్తాను.''

ముళ్లపంది డజన్ ఆపిల్ పండ్లు తన ముళ్లకు గుచ్చుకొని తెచ్చింది. ఆ సాటా బేరంతో దానికి చాలా సంతోషమైంది.

బూటు యిప్పుడు ముళ్లపందిది. కానీ, అది యెందుకు పనికివచ్చేదీ దానికి తోచలేదు. దాని నక్కడ వదలేసి వెళ్లిపోడానికి అది సిద్ధపడుతూవుండగా, ఉడుత కొమ్మనుంచి కొమ్మకు గెంతుతూ దాని వద్దకు వచ్చింది.

''యిది నీ బూటేనా?'' ఉడుత అడిగింది.

''నిస్సంశయంగా నాదే.''

''యిది నా కిస్తావా?''

''నాకు పైన్ కాయ తెచ్చిపెడితే యిస్తాను. దానినిండా పప్పు లుండాలి మరి.''

ఉడుత పైన్ కాయ తెచ్చింది.

ముళ్లపంది దాన్ని చూసి, ''ఓ, యెంత బాగుంది! యిక దీన్ని పగలగొట్టి పెట్టు, బూటు తీసుకుందువుగాని.''

అది బేరంలో భాగం కాదు. కానీ ఉడుత ఆ మాట అనకుండా, వడిగా కాయ పగలగొట్టి పెట్టింది. ముళ్లపంది పొదల్లోకి దూరి, పైన్ పప్పు తింటూ, బూటును ఉడుత యేంచేస్తుందో అని గమనిస్తూ వుండింది.

ఉడుత బూటులో వున్న కొద్ది రంధ్రాలను ఆకులతో పూడ్చింది. తరువాత, గట్టి రెమ్మతో కావడి బద్ద తయారు చేసింది, రెండు పెద్ద ఓకుకాయలతో కావడి కుండలు తయారుచేసింది. కాసేపట్లో అది వెనక్కీ ముందుకూ పరుగిడుతూ, దగ్గరలో వున్న కాలువనుండి నీళ్లు తెచ్చి రబ్బరు బూటును నింపింది. తరువాత యేంచేసింది?... తరువాత అది ఆ కొత్త స్నానాల తొట్టిలో ఉడుతపాపను కూచోబెట్టి, దానికి స్నానం చేయించింది. ఉడుతపాప ఆనందంతో కేకలు వేసింది, కాళ్లూ, చేతులూ కొట్టుతూ నీళ్లను దిక్కుదిక్కులా చిందించింది.

సరిగ్గా అప్పుడు యెలక పరుగెత్తుకుంటూ వచ్చింది.

''ఉడుతా, బూటు నా కిచ్చెయ్. నా అందమైన కొత్త కన్నం నీవు తీసుకో.''

పందికొక్కు తొట్రుపడుతూ వచ్చి యిలా అంది:

''ఉడుతా, బూటు నా కిచ్చెయ్, నీకు డజన్ ఆపిల్ పండ్లు యిస్తాను.''

ముళ్లపంది పొదల్లోనుండి ప్రాకుతూ వచ్చి యిలా చెప్పింది:

''ఉడుతా, బూటు నా కిచ్చెయ్. నీకు తట్టెడు పప్పులు యిస్తాను.''

ఉడుత అందరి మాటలూ విని, యిలా చెప్పింది:

''సాటాగా నాకు యేమీ వద్దు. యీ బూటును అందరమూ వాడుకుందాం. మీ రందరూ దీనిలో మీ పాపలను స్నానం చేయించవచ్చు.''

యెలకా, పందికొక్కూ, ముళ్లపందీ తమ స్వార్థానికి సిగ్గుపడినాయి. యెంత సిగ్గు పడినాయంటే, ఆ సిగ్గుతో వాటి ముఖాలు యెర్రబడేవే, యెర్రబడడ మంటే యేమిటో వాటికి తెలిసివుంటే.





# దయ గల గుర్రం

''నేను అందరికంటె బాగా కొక్కొరోకో అనగలను,'' అని కోడి డంబాలు కొట్టింది.

''నేను మిద్దెకప్పుమీద తల్లకిందులుగా నడవగలను,'' అని యాగ డంబాలు కొట్టింది.

''నేను యెంత చిన్న చప్పుడైనా, సవ్వడైనా వినగలను,'' అని పిల్లి డంబాలు కొట్టింది.

''నేను చీకటిలో చూడగలను,'' అని గూబ డంబాలు కొట్టింది.

''ఓ — నాకేమీ చేతకాదు,'' అంటూ కోడిపిల్ల కీచుకీచున యేడ్చింది. దాని చిన్న కన్నులనుండి పెద్ద కన్నీటి చుక్కలు కారినాయి. అది యెంత దుఃఖంతో యేడ్చిందంటే, తక్కినవాళ్లందరూ చూడలేక పారిపోయినారు.

దయ గల గుర్రం మాత్రం మిగిలింది. అది బండ్లు లాగగలదు.

గుర్రం కోడిపిల్లతో చెప్పింది: ''యేడవాకు తల్లీ, నీకూ ఒకటి చేతనవునులే — డంబాలరాయుళ్లను పారదోలడం!''

# బోల్తా పడిన పిల్లి

ఒకనాడు పిల్లి ఒక కొలనువద్ద శికారుచేస్తూ, ఒడ్డుకు దగ్గరగా నీటిలో నిలబడివున్న కొంగను చూసింది. కొంగ నీళ్లలో తల ముంచి, తన పొడుగాటి ముక్కును కలయదిప్పి, తళతళ మెరిసే చేపను ముక్కున కరుచుకొని తెస్తూ వుండింది.

పిల్లికి ఈర్ష్య కలిగింది. అది కొంగను సమీపించి, యిలా అంది:

''బలే ఉపాయమే! ముక్కును అలా కొలనులో ముంచి, ప్రతిసారీ ఒక చేపను పట్టేస్తున్నావు!''

''అబ్బే, యిదేముంది! కావాలంటే, నీకూ నేర్పుతాను.''

''నేర్పుతావా?'' పిల్లి ఆత్రంగా అడిగింది.

''చేపలు పట్టడానికి ఒక రహస్యం వుంది.''

''యేమిటది?''

''నేను ఒంటికాలిమీద నిలుచుకోవడం చూడు.''

''ఆం.''

''అదీ రహస్యం. నేను జారిపడతానో లేదో చూడాలని చేపలు తహతహతో చచ్చిపోతాయి. చూడడానికని అవి మరీ దగ్గరకు వస్తాయి. అప్పుడు ఠకీమని పట్టుకుంటాను.''

''సులభంగానే వున్నట్లుంది, నా అదృష్టం చూస్తాను,'' అంది పిల్లి.

''చూడు,'' అంది కొంగ కుయుక్తిగా.

పిల్లి జంకుతూ జంకుతూ నీళ్లలోకి దిగి, ఒకేసారి మూడు కాళ్లు యెత్తడానికి ప్రయత్నించింది. దానికి చేతకాలేదు. ఒంటికాలిమీద నిలబడడం యింత కష్టమని అది కలలో కూడా ఊహించలేదు. అది మళ్లీ మళ్లీ ప్రయత్నించి నీళ్లలో జారిపడింది, ఒళ్లంతా తడిసింది. అది వణకుతూ నిలబడింది, మీసాలగుండా నీళ్లు కారుతున్నాయి, పళ్లు టకటక కొట్టుకున్నాయి.

''ఒంటికాలిమీద నిలుచుకోవడం నీకు రాకపోతే, సరిగా చేపలు పట్టడం నీకసలు రాదు,'' అని కొంగ పలికి, ఠీవిగా జమ్ము కాడల మధ్యకు నడిచింది, ముసిముసి నవ్వులతో.

పిల్లి కాళ్లీడ్చుకుంటూ యింటికి పోయింది. దానికి చిరాకూ, కోపమూ కలిగినాయి. యెందుకంటే, అది నిష్కారణంగా తడిసిపోయింది. పైగా, కొంగ తనను బోల్తా కొట్టించింది.

# యేరు యెంత లోతుంది?

ఆవుదూడా, పందిపిల్లా మహా స్నేహితురాళ్లు. ఒకదాని నొకటి విడిచి యెప్పుడూ వుండేవి కాదు.

ఆవుదూడ దొడ్లోనుండి పచ్చిక బీడులోకి పోతే, పందిపిల్ల గుర్రుగుర్రుమంటూ దానివెంట పరుగెత్తేది. పందిపిల్ల మిట్టమీదనుండి పల్లంలోకి పరుగెత్తితే, ఆవుదూడ తన జంపు కాళ్లతో దానిని అనుసరించేది.

ఒకరోజు అవి పచ్చిక బీడులో గంతులు వేస్తూ వేస్తూ యేటి దగ్గరికి వచ్చినాయి.

''యేరు దాటుదాం,'' అంది ఆవుదూడ.

''సరే,'' అంది స్నేహితురాలు.

ఆవుదూడ నీళ్లలో దిగి నడుచుకుంటూ యేటిమధ్యకు వెళ్లింది. దానికి నీళ్లు మోకాళ్లదాకా కూడా రాలేదు.

''వచ్చెయ్! భయపడాకు! నీళ్లు లోతు లేవు,'' అని అది పందిపిల్లను కేకవేసింది.

పందిపిల్ల స్నేహితురాలివెంట పరుగెత్తింది. కానీ, కాసేపట్లో దానికి నీళ్లు చెవులదాకా వచ్చినాయి.

''అమ్మోయ్! అమ్మోయ్!'' అని అది అరిచింది.

ఆవుదూడ చెంగున వెనక్కి వచ్చి, దానిని గట్టుకు మోసుకపోయింది.

''నన్నెందుకు పిచ్చి పుల్లాయిని చేసినావు? నీళ్లు లోతు లేవని యెందుకు చెప్పినావు?'' అని పందిపిల్ల కేకలు వేసింది.

''నేను నిన్ను పిచ్చి పుల్లాయిని చేయలేదు.''

''మరి, నీళ్లు లోతు వున్నాయిగా!''

''లేవు, లోతు లేవు!''

''వున్నాయ్, లోతు వున్నాయ్!''

''లేవు, లోతు లేవు!''

అవి రెండూ యిలా కేకలు వేసుకొని, చివరకు కోపంతో చెరొక దారినా వెళ్లిపోయినాయి. అవి వాదించుకొని వుండకూడదు. యెందుకంటే, యిద్దరి మాటలూ నిజమే.

# నా పిల్లనగ్రోవి

పిల్లనగ్రోవిని చేశానూ
పెద్దది బంగరు రంగుది చూడుము.
యే వరసైనా వాయిస్తానూ,
యే పాటైనా పాడేస్తానూ.

యిదుగో చూడుము కావాలంటే
గాలి గుసగుసలు వాయిస్తానూ,
యిదుగో చూడుము కావాలంటే
యేటి గలగలలు వినిపిస్తానూ,
యిదుగో చూడుము కావాలంటే
కోకిల కంఠం పలికిస్తానూ

మైదానంలో గుర్రపు డెక్కల
టకటక టకటక మ్రోగిస్తానూ.

పిల్లనగ్రోవిని వాయించానా
తేనెటీగలూ నృత్యం చేస్తాయ్.
పిల్లనగ్రోవిని వాయించానా
అవ్వ మేకలూ గంతులు వేస్తాయ్.

ఆవులు, పందులు, గూబలు, కాకులు,
ఉడుతలు, యెలకలు, చెవులపిల్లులూ,
కుమ్మరి పురుగులు, వాటి మిత్రులూ
అన్నీ యెరుగును నా సంగీతం
వాటికోసమే వాయిస్తానని.



# తేనె దొంగ

తేనెటీగలు వెంటబడి తరిమె యెలుగునూ
''దొంగ యెలుగును పట్టుకున్నాము, ఝుమ్మ్-ఝుమ్మ్!
మా తేనె విలువైంది, ముట్టుకోవద్దు!
పోపొమ్ము వేగమే! పరుగెత్తి పొమ్మ!''
మెరుపులా పరుగెత్తుతున్నది యెలుగు,
దాని వేగము చూడ భయము గొల్పెడును,
అంత వేగంబుగా పరుగెత్తుతున్నా,
ముప్పు దప్పదు యెలుగుబంటికి నిజము.



# కుక్కగొడుగు

''యెందుకోయీ కుక్కగొడుగా గొడుగులా గున్నావు నీ''వని
ముళ్లపందొకసారి అడిగెను యెర్ర మచ్చల కుక్కగొడుగును.

''యెంత వింతగ అడుగుతుంటివి, తెలియదా యీ చిన్నవిషయం?
నేనునూ మా జాతి అంతా వానలోనే గాదె పెరుగుట!''

# పావురాలు

తెల్లవారక ముందె తెల్లనీ పావురాల్
ఒక మంచు బొరియ దగ్గర వచ్చి వాలినాయ్.
ఒక్క చుక్కే నీళ్లు తాగుతున్నా యవి;
యెందుకో తెలుసునా — జలుబు చేస్తుందని.





# అలారం గడియారం

నేల గోకితే ముక్కూ, తోకా
రెండూ ఆడును కిందికి పైకీ.

గోళ్ల వాడి మన కెంతో భయమగు,
సొగసగు యెర్రని జుట్టు శిరస్సున.

"సుప్రభాత మిది, లేవండోహోయ్!"
అంటూ కూయును రోజూ ఉదయం.

మనకు అలారం గడియార మదే,
రంగుల రంగుల కోడిపుంజు అది!

# మబ్బుమీద స్వారి

మబ్బు నెక్కి నే స్వారీ చేస్తిని
గర్వంగా తల నిక్కబెట్టుకొని
వింత పుస్తకాల్ చూస్తూ పోతూ
నల్ల పిట్టలకు తిండి పెట్టితిని.

మేఘం కొంచెం చినిగిపోవగా
అతుకువేసి సరిచేస్తిని దానిని.
అసూయ పడకోయ్ అబ్బాయీ,
యిది అంతా నా కలలో జరిగెను.



చిత్రాలు: వి. చీజికొవ్

అనువాదం: రాచమల్లు రామచంద్రారెడ్డి

М. ПЛЯЦКОВСКИЙ
Я НА ОБЛАКЕ ЛЕТАЛ .
Рис. В. ЧИЖИКОВА
*на языке телугу*

